శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వరాయ నమః

# కాకాని శివశతకము

శ్రీ వారణాశి సమమగు
పావన కాకాని భక్త పరిపాలన స
ద్భావమున నమ్మితిని, నను
గావవె యో దేవదేవ! కాకానిశివా

క౦. శ్రీరజతగిరి విహారా!
మారారీ! పరమభక్తమానసచోరా
పారావార గభీరా!
కారుణ్యనిధాన! దేవ! కాకాని శివా.

క౦. రారా గౌరీనాయక!
రారా గణరాజజనక! రారా శంభూ!
రారా లలాటనేత్రా!
కారుణ్యనిధాన! దేవ! కాకాని శివా. 3

క౦. కోరికతో నినువేడగ
మారాడక వరము లిచ్చె మంగళవేషా!
ఏరీ నీ సరి వేల్పులు?
కారుణ్యనిధాన దేవ! కాకాని శివా. 4

క౦. ధీరుండగు రఘురాముఁడు
కోరిన వర మొసగు, నీవు కోరక మునుపే
భూరిసుఖ మొసగుదువు భళి
కారుణ్యనిధాన దేవ! కాకాని శివా, 5

క౦. కోరితి నీ పదములు నేఁ
గోరఁగ లే దన్యసుఖము కుజనవిదూరా!
కోరినవరముల నొసగవె
కారుణ్యనిధాన దేవ! కాళాని శివా. 6

క౦. మీరను మీ పదభక్తిని
మీరఁగ దా బుధులయాజ్ఞ మేలుఁగ నెపుడున్
సారాచారవిచారా!
కారుణ్యనిధాన దేవ! కాళాని శివా. 7

క౦. నేరము లెంచకు నా యెడ
నేరములే తోఁచుచుండు నిక్కముగా నే
నేరక నేరము సేయుట
కారుణ్యనిధాన దేవ! కాళాని శివా. 8

క౦. సురవర శుభకర, పురహర
గిరిరాజాచిత్తచోర! గీర్వాణనుతా!
పరమాత్మ వరద శశిధర
కరుణాలయ దేవదేవ! కాళాని శివా. 9

క౦. పరమకృపానీరధి వని
దరిజేరితిఁ బ్రోవుమయ్య దానవశత్రా!
పరదైవంబుల గొల్వను
గరుణాలయ దేవదేవ! కాళాని శివా. 10

క౦. హరహర యని స్మరియించిన
బిరబిర పాపములు బాయు విశ్వేశ! నినున్
మరచి యొక క్షణము నుందునె?
కరుణాలయ దేవదేవ! కాళాని శివా. 11

కం. వరదా! నీ దరిఁజేరితి
గరుణను నను గావుమయ్య కారుణ్యనిధీ!
దరిఁజేర్ప నీదె భారము
కరుణాలయ! దేవదేవ! కాకాని శివా. 12

కం. పరమును భాగ్యం బీవే,
సిరి సంపద సౌఖ్యములును జీవము నీవే
మరు గేల సర్వ మీవే
కరుణాలయ దేవదేవ! కాకాని శివా. 13

కం. పరిపూర్ణపరబ్రహ్మము!
పరమాత్మా! పరమధామ! పావన నామా!
పరిపూర్ణ సుగుణ శేఖర
కరుణాలయ దేవదేవ! కాకాని శివా. 14

కం. ఉరగేంద్రభూషణంబులు
కరిచర్మము మేనఁ దాల్చి గంగను దలపైఁ
గరమున త్రిశూలముఁ గొని
గరకంఠా! ధీర! దేవ! కాకాని శివా. 15

కం. నానావిధజపతపములఁ
బూనియు నినుఁ గానరైతి భూతేశ! ధృతిఁ
జ్ఞానము నిల్పవె, సంసృతి
కాననవైశ్వానరుండ! కాకాని శివా. 16

కం. ఎన్నెన్ని జన్మములలో
యున్నా! నరజన్మ దొరికె నానందములో
నిన్ని మఱిమఱి చూచెదఁ
గన్నారఁగ దేవదేవ! కాకాని శివా. 17

కం. నిన్నుఁ గనలేక మదియం
దెన్నో కోరికలచేత నెసగుచు నుంటిన్
పన్నగభూషణ నన్నున్
గన్నందుకు గావు దేవ! కాకానిశివా. 18

కం. నే నెందు నుండి వచ్చితొ
యే నెవరో? యేరివలన నిలఁ గలిగితినో?
యే నీవాడ దెలిసె, నఘ
కానన వైశ్వానరుండ! కాకానిశివా. 19

కం. నే నున్నవఱకు నేనె
మేను వదల నీకె యగుదు, నీ నా మధ్యన్
బూనిక ప్రకృతి మెలంగను
గావగ లేకుంటె నిన్నుఁ గాకానిశివా. 20

కం. నినుఁ బొగడ నేర్పు లేదిఁక
నిను దెలిసెడి తెలివిలేదు నీలగళా! యిం
కను నేగతిఁ గాచెదవో
ఘనభక్తావన మహాత్మ! కాకానిశివా. 21

కం. ననుఁ గావ నీదె భారము
గనుగొంటిని భక్తపాల! కరుణావార్ధీ!
యనుమాన మేల నా కిఁక
గనవే రయా దేవదేవ! కాకానిశివా. 22

కం. మును చేసిన దోషములను
మనమున నెంచుటయు ధర్మమా? విశ్వేశా!
కినుకను బూనక దయతో
గనవే నన్ దేవదేవ! కాకానిశివా 23

కం. వినఁ జెవులుఁ గనఁగఁ గన్నులు
ఘనముగ స్తుతిసేయ నోరు గలిగియు మనుజుల్
నిను నెంచ రేమిపాపము
కనుమా! యో దేవదేవ! కాకానిశివా. 24

కం. మన సయ్యది వ్యభిచారిణి
యనువుగ నింద్రియము లన్ని యజ్ఞానమునన్
జనవుగ బడద్రోయును నరుఁ
గనుమా! యో దేవదేవ! కాకాని శివా. 25

కం. అనయము నీ మృదుపదములు
మనమున ధ్యానించునట్టి మది నిశ్చలతన్
బొనరగ దయసేయుము దయఁ
గనుమా! యో దేవదేవ! కాకాని శివా. 26

కం. జనకా! నీ దయకును నే
ననుదినమును జూచుచుంటి నార్తశరణ్యా!
నను గావ నీదె భారము
కనవే! యో దేవదేవ కాకాని శివా. 27

కం. దనుజులఁ బరిమార్చియు మును
ఘనముగ నిర్జరుల కెల్లఁ గడు సంతోషం
బును నీయలేదె దయతో
గనుమా! యో దేవదేవ! కాకాని శివా. 28

కం. దీనజనపాప మడఁపగఁ
బూనికతోఁ దారకమును బోధించియు బ్ర
హ్మానంద మొసగు చుందువు
కానగదే దివ్యపురుష! కాకాని శివా. 29

కం. నే నేమి యొగ్గుజేసితి
గానీ నీ కరుణ సుంత గనుబడ లేదే
యీ నాడైనను నొసగుము
జ్ఞానమయా! వేడుచుంటిఁ గాకాని శివా. 30

కం. మానసవాక్కాయంబుల
మానక నీ సేవఁజేతు మహనీయగుణా!
దీనజనావన! దీనుఁడ
గానగరా! దేవదేవ! కాకాని శివా. 31

కం. ఎన్నో దినములనుండియు
సన్నుతి చేసినను సుప్రసన్నతఁగనవా?
మున్నేమిచేసితిని నా
కన్నులఁ గనబడవదేల? కాకాని శివా. 32

కం. పన్నగభూషణ! హరహర
యన్నంతనె పాపమంత హతమౌను సుమా
నన్నేల జాగదేలా?
కన్నారగ గాంతు రావె కాకాని శివా. 33

కం. క్షణమైన మరువకయు నిను
మనసారగ గొల్చుచుంటి మానాథసఖా!
గుణములు నాయెడఁ గుదురవె
గణపతిగురు దేవదేవ కాకాని శివా! 34

కం. పనిలేని వేడ నేరము?
పని గల్గినవారు వేడఁ బరుగిడిపోవే?
పని యేల నిన్నుఁ గనుటే
కనవే నను దేవదేవ కాకాని శివా. 35

కం. దీనదయాళుడ వీ వని
దీనతతో వేడుచుంటి దితిసుతహరణా!
దీనతఁ బాపుము భవహర
గానగరా దేవదేవ! కాకాని శివా. 36

కం. కామాద్యరిషడ్వర్గము
స్వామీ! నినుఁ దెలియనీవు సరగున వానిన్
నీ మహిమ దూర మంపుము
కామారీ దేవదేవ కాకానిశివా. 37

కం. కామాంధకారమున నీ
ప్రేమామృతచరిత గనక బేలను నైతిన్
ఏమాడ్కి గాంతునో దయ
కామారీ దేవదేవ! కాకానిశివా. 38

కం. పామర గుణములచే నీ
కోమలపదపంకజముల గొల్వగ లేకఁ
గాముకుడ నైతి నకటా
కామారీ దేవదేవ! కాకానిశివా. 39

కం. నా మనము నీదు పదముల
నేమరకయు నిల్పు సతము హేరంబపితా!
పామరుడని మది నెంచక
కామారీ దేవదేవ కాకాని శివా. 40

కం. భ్రమ వదలి సర్వవిధముల
సమబుద్ధిని నిన్నుఁ గొల్వ సకలసుఖములన్
అమరుగద యమరవందిత!
కమలాసనవంద్య!దేవ! కాకానిశివా. 41

కం. యమనియమాదుల నెఱుగను
గ్రమముగ భక్తియును దెలియఁ గరుణాసింధూ!
భ్రమలోనఁ దగిలి కొలిచితి
శమలోదరమిత్ర! దేవ కాకానిశివా. 42

కం. స్వామీ! నీ కంటెను నీ
నామం బత్యధికమంచు నాకు దెలిసె నే
నే మందు నామమహిమను
కామహరా! దేవదేవ కాకానిశివా. 43

కం. అవయవపుష్టి, యరోగత
పరివిమల మగు నెఱుక, బుద్ధి బల మొసగి భవా
నవినాశపదవి నీయవె
కవిపోషా! నాగభూష! కాకాని శివా. 44

కం. నీవే మాతయు భ్రాతయు
నీవే నా యంతరాత్మ నీవే సుఖముల్
నీవే సర్వశ్రేయము
గావవె యో దేవదేవ కాకాని శివా. 45

కం. భావము పరికింపగలే
దేవిధముగ జూడ గన్నులిలఁ జాలవు పో
పావనచరితా! కరుణను
గావవె నను దేవదేవ కాకాని శివా. 46

కం. దేవా! కరుణాలయుడవు
గావా? నాయెడల నింత కఠినత యేలా!
ప్రోవవె భక్తజనాలిని
గావవె నను దేవదేవ కాకాని శివా. 47

కం. నీవే రక్షకు డనుచును
భావంబున నమ్మియుంటి పరమమునీంద్ర
స్సేవిత దీనుల మొఱ విని
గావవె నను దేవదేవ కాకాని శివా. 48

కం. మృత్యువురా మార్కండుడు
మృత్యుంజయు యంచు గొల్వ మృత్యువు నపుడే
భృత్యు స్తముగాఁ జేయవె
కాత్యాయని ప్రాణనాథ! కాకాని శివా. 49

కం. సత్యము జపమును దపమును
నిత్యము జరుపంగ లేక నిను వేడితి నో
సత్యస్వరూప! ప్రోవుము
కాత్యాయని ప్రాణనాథ! కాకాని శివా. 50

కం. సంతానము లే దనుచును
జింతించియు నిన్ను వేడ శీఘ్రం బీవే
యెంతో దయరాశివిగద
కంతుహరా! దేవదేవ! కాకాని శివా. 51

కం. ప్రతినిమిషంబున నిను గన
మతియందు దలంప నీదు మాయయు నెంతో
నతలకుతలమును జేయును
గతి యెవ్వరు నీవుదక్క కాకాని శివా. 52

కం. సతతము నీవే శరణని
యతితోషిత నమ్మియుంటి నార్తావన నా
మతి శాంతి జేయవే స
ద్గతి యెవ్వరు నీవు దక్క కాకాని శివా. 53

కం. సర్వము నీ కృప యంచును
సర్వోత్తమ! తెలిసికొంటి సజ్జనరక్షా!
సర్వసమత్వం బీవే!
గర్వము పోద్రోలి ప్రోవు కాకాని శివా. 54

కం. సర్వము నీవై వెలుగుచు
సర్వంబున కంటకుండి సర్వజగంబుల్
ధూర్వహత నేలుచుండగ
గర్వము పోద్రోలి ప్రోవు కాకాని శివా! 55

కం. సర్వేశ సర్వరూపా
సర్వజ్ఞా! సర్వరక్ష! సర్వాధారా
సర్వం బీవని గంటిని
గర్వము బోద్రోలి ప్రోవు కాకాని శివా. 56

కం. పాపాత్ముల పాపంబుల
బాపుటకై యవతరించి బహుపాపాత్ముల్
బాపి పవిత్రుల జేయగ
కాపాడగ నీకె తగును కాకాని శివా. 57

కం. ఆపదలో నుంటి హరా!
ఆపదలను బాపువాడ! యవ్యయ! దేవా
అపుడు యాపద లెల్లను
గాపట్యములేని దేవ కాకాని శివా. 58

కం. అందున నిందున మధ్యను
సందును లేకుండి వెల్గు సత్సంకల్పా!
సందేహించక ప్రోవుము
కందర్పునిహరియయ్య కాకానిశివా. 59

కం. వందనము నీకు విశ్వా
వందా! వందితమునీంద్రనవహృత్కందా!
వందనము! దేవవందిత
కందర్పవిఘాత హరణ! కాకాని శివా! 60

కం. సందేహింపకు నాయెడ
సందేహము లున్న జెప్పు సంసారిని నా
యందున దోషము గలదే
కందర్పుని గెలిచినట్టి కాకాని శివా. 61

కం. ఎందాక నిన్ను వేడుదు
నెందుకు నాయెడల నేర మేమున్నదయా!
యిందుధర! చండికేశ్వర
కందర్పుని గెలిచినట్టి కాకాని శివా. 62

కం. నీదయకు బాత్రుడను నే
గాదా? నాలోన భక్తి, జ్ఞానము లేదా
లేదే సద్దయ నీయెడ
కాదా నీ వాడ? దేవ! కాకానిశివా. 63

కం. వేదాతీత పరాత్పర
వేదోద్ధారక సుధీర వేదవిచారా!
లేదే నాయెడఁ గపటము,
కాదా? యో దేవదేవ కాకానిశివా. 64

కం. ఫాలాక్ష! నిత్యభిక్షా
పాలించగ నీకె తగును పామరశిక్షా
పాలించు జగద్రక్షా
కాలుని మద మణచి నట్టి కాకానిశివా. 65

కం. కలనైన నను గనబడవే
కలిదోషము లెన్ని యున్న కల్మషహరణా
యిల నిన్ను స్మరణ జేసిన
కలుషావళి యుండు టెట్లు కాకానిశివా! 66

కం. కలిసుఖము స్థిరముగాదే
సలలితమగు నాయు వనిన జలబుద్బుదమే
యిల నెంచఁ గలదు సమమే
కలికల్మషహరణ! దేవ! కాకాని శివా. 67

కం. పలు విధములఁ బ్రార్థించిన
బలుకవు, పలికినను పరువు భంగం బగునే
పలుకుము నెల తల జాలిగ్గదు
కలుషహరా దేవదేవ! కాకాని శివా. 68

కం. బాలకుడని నీ మదిలో
జాలియు గనుపించ దేర? జగదాధారా!
కాలము వ్యర్థము చేయకు
కాలుని బలిగొన్న దేవ! కాకాని శివా. 69

కం. నీదరి జేరిన వారల
గాదనకయ గాతు వనుచుఁ గవివరు లెంతో
మోదమున బల్కు రహహా
కాదా యో దేవదేవ! కాకాని శివా. 70

కం. మాయది సంసారం బని
మాయదిదియే సకల మంచు మది నిశ్చలతన్
జేయుచు మృత్యుంజయ నినుఁ
గాయజహార నమ్మియుంటిఁ గాకాని శివా. 71

కం. మాయ నిజమ్మును దెలిసియు
మాయకు లోబడుటయేల మాయవిదూరా
మాయిక నీమాయ దెలిసె
ఖాయముగా నమ్మినాడఁ గాకాని శివా. 72

కం. కులమును రూపము విద్దెయు
కలభోగము లున్న నీలకంధర నీపై
సలలితభక్తియు లేకయు
గలదే కళ యేరికైనఁ గాకాని శివా. 73

కం. కష్టము వచ్చుట సుఖముకె
కష్టము భరియింపజాల జ్ఞానాతీతా!
కష్టసుఖంబులు సమముగ
కష్టము లేకుండజేయు కాకాని శివా. 74

కం. ఈశా! నీవాడను స
ర్వేశా! నీ పాదభక్తి నిడవే యెపుడున్
ఆశాపాశము లణచియుఁ
గాశీపతి కావరావె కాకాని శివా. 75

కం. పశువులవలె నింద్రియములు
వశపడక యనుక్షణంబు వైరము బూనెన్
బశుపతి నను మన్నింపవె
కసిబూనకు దేవదేవ! కాకాని శివా. 76

కం. ఫలకాంక్ష రహితులై నిను
దలచినచో జన్మ గలదె? దానవభంగా!
యిల మాయ ద్రుంచ నీకగ
కలుషహరా! దేవదేవ! కాకాని శివా. 77

కం. నీయందు భక్తి శ్రద్ధయు
నీ యర్మిలిభక్తవరుల నెయ్యమును సదా
నాయందు దయను గల్గియు
ఖాయముగా కావుమయ్య! కాంకాని శివా. 78

కం. కోరెదు కోరిక లేదిక
గౌరీసతిగూడి మదిని కారుణ్యమునన్
జేరి నివసింపు; నీ కృప
కారుణ్యాలయ సురేశ! కాంకాని శివా. 79

కం. ఎల్లసుఖంబులు నీ దయ
వల్లను ప్రభవించునంచు వాస్తవ మని నా
యుల్లమున దెలిసె గనునది
కల్లని నీ దయను గంటిఁ గాంకాని శివా. 80

కం. శ్యామలనాథా! నీ కృప
శ్యామలసుందరుని జనకజాపతిచరితన్
ప్రేమను వర్ణింపగ దు
ష్కామహరా! కంటి, దేవ! కాంకాని శివా. 81

కం. హరిహరుల కభేదంబని
హరహర నీ దయను గంటి యజ్ఞానదశన్
ఇరువురకు భేద మెన్నితి
గరుణను మన్నింపుదేవ! కాంకాని శివా. 82

కం. శ్రీరాముదయను గోరెడి
వారలు ముమ్మందు నో శివా యని నిన్నున్
గోరార ననినఁ జాలును
కారుణ్యాలయ సురేశ కాంకాని శివా. 83

కం. మనసే రాజని తలచిన
మనసే బహుమాయ జేయు మాయలయు దెల్పన్
మన సెంత మహిమగలదో
కనజాలను దేవదేవ! కాళకాని శివా. 84

కం. ధరణిని రత్నము గనిలో
నరయఁగ మృచ్ఛాదనమున నగుపడని విధిన్
పరజీవాత్ముల నెఱుఁగము
కరకరి మాయాభిగుప్తిఁ గాళకాని శివా! 85

కం. కాముకుడని మది నెంచక
కామము పోద్రోలి నన్నుఁ గావుము తండ్రీ!
కామాది విషయదూరా!
కామితఫల మొసగు దేవ! కాళకాని శివా. 86

కం. నీదరి జేరిన వారల
కాదనకయ గాతు వనుచు గవివరు లెంతో
మోదమున బలికి రహహా
కాదా? నీ వాడనంటి కాళకాని శివా! 87

కం. జడిపింప బోకు జనకా!
జడిపింపగ గుండె యదరు సర్వజ్ఞ! యికన్
జడియకని యభయ మీవే
కడుభక్తుల బ్రోచు దేవ! కాళకాని శివా! 88

కం. మాయను దాటగ నాకును
పాయము బోధింప నెవరు! పావనచరితా!
మాయకు పతి వీవే యని
ఛాయముగా నమ్మినాడఁ గాళకాని శివా! 89

కం. హరహర శంభో యని మును
సురవిభునిసుతుండు పొగడ సుస్థిరవరముల్
మురిపెమున నొసగవే భళి
కరుణాలయ! దేవదేవ! కాకాని శివా! 90

కం. శ్రీరఘురామునియందలి
ప్రేమను నర్ధాంగియైన ప్రియశ్యామలను౯
దీమమున వదలితివి భళి
కామహరా! నీకె తగును కాకాని శివా. 91

కం. హరినామములు సహస్రము
సరియగు శ్రీరామ యనిన జాలు నపర్ణా!
పరమ రహస్యం బిది యని
కరుణను బోధింప లేదె? కాకాని శివా. 92

కం. శ్రీరామచరిత పూర్తిగ
సారమతి౯ గౌరి కోర సంశయము విడ౯
మీరగ భక్తిని దెలిపిన
కారుణ్యాలయ! సుధీర! కాకాని శివా. 93

కం. క్షీరాంబుధికి సమంబగు
శ్రీరామునిలీల లెంచ శివ! నీకె తగు౯
గౌరీమనోబ్ధిచంద్రమ!
కారుణ్యాలయ సుధీర కాకాని శివా. 94

కం. ఈ శతకము పఠియించిన
వ్రాసిన విన బరమపదవి లభ్యం బగు న
ట్లాశీర్వదించి ప్రోవుము
కాశీ సమమైన పెద్ద కాకాని శివా. 95

కం. వాలాగ్ని అప్పదాసుడ
ఫాలాక్షా! నీదు పాదభక్తియు నిపుడే
జాలము సేయక యొసగుము
కాల్గుని స్తుతి గొన్న దేవ! కాకాని శివా. 96

కం. వేదార్థ తత్త్వరూపా!
శ్రీ దయితునిమిత్ర! శేముషీవత్స్తోత్రా!
రోదోంతరాళపూరిత
ఖాదిమహాష్టతనుమూర్తి! కాకాని శివా. 97

కం. నమ్మిన వారలఁ బ్రోచెదు
కమ్మని దొరవౌట నన్నుఁ గావుమటంటిన్
బమ్మతల దీయుదేవర
కమ్మవిలుతు గొంగ! సామి! కాకాని శివా. 98

క. చలిమల యిలుఁ గలిగియు నా
చలివెల్గుల దొరను దలను సవరించిన యో
చలిమల కూరిమి యల్లుఁడ!
కలిమియు లేమియును లేని కాకాని శివా! 99

కం. ధర యువ సంవత్సరమున
బరగగఁ గార్తికిక శుక్ల పక్ష దశమియున్
బరమ శుభ దివసమున స
త్కరుణను మత్కృతిని గొనుము కాకాని శివా. 100

కం. మంగళము మహాదేవా!
మంగళము నుమామహేశ మహనీయగుణా!
మంగళము మోక్షదాయక
గంగాధర దేవదేవ! కాకాని శివా. 101

శ్రీ పార్వతీ పరమేశ్వరాయ నమః.

# కీర్తన

1. ఘనులార చూతాము రండి !

కాకాని మల్లేశ్వరుని కరుణ బొందుదమండి.

||ఘనులార||

పనియేల మా కనుచు బల్కంగ వద్దండి, పని లేనివా రెవ్వరండి - అయ్యో పనిదీరదే జ్ఞ సుమండి, చాల పనులున్నవని తెలియరండి - యెన్ని పనులు గల్గిన దీర్చు పార్వతీశ్వరుడండి. ||ఘనులారా||

2. చుట్టుప్రాకారాలు, సొగసైన పంగిళ్లు, అట్టివా సంబైన గుళ్లు - నేలమట్టముగ గట్టిన పరుపురాళ్లు, చాల గట్టించినట్టి చావిళ్లు - నిజమా పట్టణమున గలవు పరిశుద్ధమగు నీళ్లు. ||ఘనులారా||

3. ప్రతియాదివారమున అతిథిభక్తిగాను, దంపతులెంతో ప్రదక్షిణములు - జేసి, మతిదీర మహదేవు పదములు నమ్మి గతి నీవె యనగ కోరికలు - దీర సతతము సుఖముగ నుందురు, సద్భక్తితో జనులు||ఘనులారా||

4. గోవులమందల గొర్ల - దేవు సన్నిధి ద్రిప్పి, కావాలి యని మొక్కువారు - గాలి వావాలియని దిరుగు వారు, సంతు కావాలి మాకనెడివారు, చీమ పోవుటకు వీలగు న - భాగ్నోద్రేకం బమరు. ||ఘను||

5. గుంటూరునకు రెండు - క్రోసులు దూరమునుండు యింటింట శివ పూజలుండు - వెంట వెంటను మోటార్లు వచ్చుచుండు - వీధు లెరంట దుకాణంబు

లుండు - ఆహాహా, కంటకములన్ని, గంటి కర
కంతుండు. ॥ఘనులారా॥

6. తనువు నిత్యముగాదు, ధనము సత్యముగాదు, మనతో
వచ్చునదేది లేదు - సర్వ,మును జెలియ శాశ్వతము
గాదు - వినుడు తను దెలియనిదా, ఘనము గాదు -
గనుడు కనులున్నందుకు సార్థ, కము మనకు
చేకూరు. ॥ఘ॥

7. సకల దేశముల స,జ్జనులు వచ్చెదు రండి - సకల
వ్యాధులు పోవునండి - భామ, లకు సంతుయిచ్చు
నమ్మండి - భక్తులకు వరము లొసగు, సుమండి -
గనుడి ఒకసారి దర్శించ, ఉండవు పాపమ్ము లండి.

8. ఆలయమునకు ముందు, యానందమును జెందు, ఆ
దాసవశుల పసందు - ఆహాహా ఆ నంది సుందర మే
మందు- బహుగ స్త్రీలెంతో పూజింతుర్రి ముందు-
ధ్వజము తలయెత్తి చూచుటకు తరముగా దేమందు.
॥ఘనులార॥

9. అంగనా మణులెల్ల, అదివారం బెంతో - పొంగళ్లు
జేసి మరంత - అతిథు, లంగని పిలచియు వింత -
మదులు, పొంగ ఓగిరమిచ్చి చింత - బాసి, గంగా
ధరుని చెంత, గలిసి వేడుదు రంత. ॥ఘ॥

10. ప్రణవ నాదము లిచ్చు, భేరి ఘంటలు హెచ్చు -
ప్రణుతి జేసిన మదికి నచ్చు - వాటి,గణుతింప లేరవ
వచ్చు, ప్రభల, ఘనత యేమని చెప్పవచ్చు - చాల
వినుతింప రానట్టి వృషభంబులే వచ్చు. ॥ఘ॥

11. పండరినాథా విఠల, పాండురంగాయంచు - పండరి భజనలు సేయువారు-భక్తి నిండా రాముని గొల్చు వారు - భారత జండా పతాకాల వారు - కనుల పండుగ నుండు బృందాభజనలు వారు. ||ఘు||

12. సకలజీవుల మరణ సమయమందున ముక్తి ప్రకట ముగ తానివ్వనెంచి - శ్రీ తారక మంత్రమున కటా క్షించి - జీవులకు మోక్షమిచ్చు నెన రుంచి- మీరు ప్రకృతి వలలోబడక పరమే శ్వర మనియెంచి ||ఘు||

13. గాలిసోకినవారు, కనులనొప్పులవారు - అలి సుఖ ములు గోరువారు - దీర్ఘ, కాలము వ్యాధుల బాధ వారు - కడుపు, శూల గాధల చెందువారు - స్వామి, యేల కావవె మమ్మనివె ముడుపులనువారు ||ఘునులార||

14. ధనము ధాన్యము గోరు, తరుణు లచ్చట లేరు తన యులు కావ లనెడువారు - వినుడు, తను వారో గ్యము గోరువారు - గనుడు, మనుజన్మ వలదనెడు వారు - చనుడు మనసార సేవింప, మహదానందం బమరు. ||ఘునులార||

14. వర కైలాసమునుండి, కరుణారసము మీర ధర కాశీపురము చేరి - చాల, సిరు లొసగుచుండె కామారి - శిత, కరధారి త్రిపురసంహారి - సతము వర వేంకటప్పలాశ్రిజ పోష గిరిచారి. ||ఘునులార||



ఈ కవిచే రచింపఁబడి

## అచ్చువేయింపబడిన గ్రంథములు

1. శ్రీరామరామశతకము
2. శ్రీకిరపండరీనాథ శతకము
3. శ్రీవేంకటేశ శతకము
4. (మాధవదాస చరిత్ర) సందేహ నివృత్తి
5. సులోచన (హరికథ)
6. భక్తనామదేవకల్యాణము (హరికథ)
7. శ్రీమహారాష్ట్ర తులసీదాస రామాయణము

## అచ్చుకానున్న గ్రంథములు

8. మానస [illegible] శతకము
9. [illegible]

ప్రాప్తిస్థానము,—

సంతగుడిపాడు,

గుంటూరుజిల్లా

నరసారావుపేట తాలూకా.

(డిటో పోస్టు)

బెజవాడ: ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
అయ్యంకి వేంకటరత్నం పంతులు (M. Sc) గారిచే
ముద్రితము.